## మా కార్యక్రమాల దృశ్యాలు



మమత ఒల్డేజ్ హోం ప్రప్రథమ వార్షికోత్సవ సందర్భంగా ప్రముఖ సంఘసేవిక శ్రీమతి కామరాజు సరోజినీ దేవి గారిని (ప్రిన్సిపాల్) సత్కరిస్తున్న ప్రా॥ జి.వి. సుబ్రహ్మణ్యం గారు తదితరులు



దివిసీమలో తుఫాను బాధితులకు సేవాదృక్పథంతో ఉడతాభక్తి సహకారం




ట్రస్టు ప్రప్రథమ వార్షికోత్సవ సందర్భంగా చిన్నారులకు దుస్తులు అందజేస్తున్న దృశ్యం



కమలాకర ట్రస్టు అవార్డు ప్రదానం సందర్భంగా ఆర్టిస్టులకు జ్ఞాపికలు అందజేస్తున్న శ్రీమతి వి.ఎస్. రమాదేవి గారు, తెలుగు విశ్వవిద్యాలయం వి.సి. డా॥ ఆవుల మంజులత గారు

చేయి చేయి కలుపుదాం- సేవ చేయ కదులుదాం

# జీవన వికాసం

(ప్రార్థన - చింతనం)



ప్రచురణ

లలిత కళాభారతి

కమలాకర మెమోరియల్ ఛారిటబుల్ ట్రస్టు

సామాజిక - సాంస్కృతిక - ఆధ్యాత్మిక సేవాసంస్థ

కమలాకరనిలయం, గోఖలేనగర్, రామాంతపూర్, రంగారెడ్డి జిల్లా

## మా కార్యక్రమాల దృశ్యాలు



డా॥ జయప్రకాశ్ నారాయణ, లేడీ గవర్నర్ మిసెస్ రంగనాథన్ గార్లతో కమలాకర ట్రస్టు సభ్యులు, తదితరులు



మల్లాది పద్మావతి గారు రచించిన వెంకటేశ్వర కీర్తనలు ఆవిష్కరణోత్సవ సదస్సు దృశ్యం



లలిత కలాభారతి ప్రారంభోత్సవ సందర్భంగా మాజీమంత్రి శ్రీమతి లక్ష్మీ కాంతమ్మ గారిని సత్కరిస్తున్న ప్రముక మహిళలు



ట్రస్టు వార్షికోత్సవ సందర్భంగా నృత్యరూపక ప్రదర్శన దృశ్యం

**కళలద్వారా వికాసం సాధిద్దాం**

# జీవన వికాసం

## (ప్రార్థన-చింతనం)

సంకలనం

**ఆచార్య కసిరెడ్డి**






**కమలాకర లలిత కళాభారతి మెమోరియల్ ఛారిటబుల్ ట్రస్టు**

రి.నెం. 511/90

(సామాజిక-సాంస్కృతిక-ఆధ్యాత్మిక సేవాసంస్థ)

కమలాకర నిలయం, గోఖలే నగర్, రామాంతపూర్, రంగారెడ్డి జిల్లా.
హైదరాబాద్ - 500 013. ఆం.ప్ర.
ఫోన్ : 040-65176086, సెల్ : 93472 03306

**జీవన వికాసం**

(ప్రార్థన-చింతనం)

**సంకలనం : ఆచార్య కసిరెడ్డి**

ప్రథమ ముద్రణ : 2007 నవంబర్

ఆంధ్రప్రదేశ్ అవతరణ దినోత్సవము

ప్రతులు : 1000

ప్రచురణ : కమలాకర లలిత కళాభారతి

ప్రతులకు :

**కమలాకర మెమోరియల్ ఛారిటబుల్ ట్రస్టు**

రి.నెం. 511/90

(సామాజిక-సాంస్కృతిక-ఆధ్యాత్మిక సేవాసంస్థ)

కమలాకర నిలయం, గోఖలే నగర్,

రామాంతపూర్, రంగారెడ్డి జిల్లా.

హైదరాబాద్ - 500 013. ఆం.ప్ర.

ఫోన్ : 040-65176086

సెల్ : 93472 03306

ముద్రణ :

కర్షక్ ఆర్ట్ ప్రింటర్స్

40, ఎపిహెచ్‌బి, విద్యానగర్, హైదరాబాదు-44

ఫోన్ : 27618261, 27653348

**అమూల్యం**



# నివేదన

2007 నవంబర్ 1 ఆంధ్రప్రదేశ్ అవతరణ దినోత్సవం సందర్భంగా వ్యక్తి వికాసానికి ఆధ్యాత్మిక సాంస్కృతిక చైతన్యానికి దోహదం చేసే "పుస్తిక" (Booklet) ప్రచురించాల నుకొన్నాం. ఆచార్య కసిరెడ్డి గారిని సంప్రదించాం. వారిది సంసిద్ధం చేసి ఇచ్చారు.

ఇందులో వందేమాతరం, శ్రీ గణపతి ప్రార్థన, శ్రీ సరస్వతి ప్రార్థన, వివిధ దేవత స్తుతులు(శ్లోకాలు), వివిధ దేవతాస్తుతులు (పద్యాలు) భారతమాత స్తుతి, శ్రీకృష్ణ, సుమతీ, వేమన, నరసింహ, నారాయణ, శ్రీకాళహస్తీశ్వర, దాశరథి, సర్వేశ్వర శతకాలలోని కొన్ని పద్యాలు, రామాయణ-భారత-భాగవతాల్లోని కొన్ని పద్యాలు, వేదసూక్తులు, ఉపనిషత్ సూక్తులు, గీతాసారాంశం, వ్యక్తి వికాస పాథేయం పేరిట కొన్ని శ్లోకాలూ, భావాలు, స్వామి శివానందసరస్వతులవారు ఆధ్యాత్మిక ప్రపంచానికందించిన విశ్వ ప్రార్థన, వ్యక్తి ఆధ్యాత్మిక చైతన్యానికి దోహదం చేసే మహర్షి మలయాళస్వాముల వారందించిన దైవప్రార్థన, యజుర్వేదంలోని శాంతిమంత్రాలు... ఉన్నాయి.

ఇవి బాలబాలికలు, యువతీయువకులు, వృద్ధులు అందరూ ధారణ చేయాలని మా సంకల్పం. ధారణతోపాటు ఈ ప్రార్థనలను, ఆధ్యాత్మిక జాతీయ సాంస్కృతిక అంశాలను అర్థం చేసుకుంటూ అధ్యయనం చేస్తే ప్రతివ్యక్తీ పారమార్థికవాదిగా మారిపోతాడని మేం భావిస్తున్నాం. ఎందరో మహానుభావుల మహర్షితుల్యుల శుద్ధసంకల్పానికి తపశ్శక్తికి నిదర్శనమే ఈ అమృతసూక్తం-ఈ జీవన వికాసం.

కమలాకర మెమోరియల్ ఛారిటబుల్ ట్రస్టులో అంతర్భాగంగా ఉన్న లలితకళాభారతి ఆధ్వర్యంలో ఇది ప్రచురిస్తున్నాం. ఈ ప్రచురణకు సహకరించిన దాతలకు వదాన్యులకు, మా ట్రస్టును ప్రోత్సహిస్తున్న అందరికీ మా హృదయపూర్వక ధన్యవాదాలు.

మీ ఆత్మీయ సోదరి

భారతీదేవి

హైదరాబాదు

తేది. 01-11-2007

# వందేమాతరమ్

వందేమాతరం - వందేమాతరమ్
సుజలాం సుఫలాం - మలయజశీతలామ్
సస్యశ్యామలాం మాతరం - వందేమాతరమ్.

శుభ్రజ్యోత్స్నాపులకిత యామినీమ్
పుల్లకుసుమిత ద్రుమదళ శోభినీమ్ ।
సుహాసినీం సుమధురభాషిణీమ్
సుఖదాం వరదాం మాతరం - వందేమాతరమ్.

కోటికోటి కంఠకలకల నినాద కరాలే
కోటి కోటి భుజైర్ధృత ఖరకరవాలే
అబలాకేనో మాఎతోబలే
బహుబల ధారిణీం నమామితారిణీం
రిపుదళ వారిణీం మాతరం - వందేమాతరమ్.

తుమివిద్యాతుమిధర్మ - తుమిహృదితుమిమర్మ
త్వంహి ప్రాణాః శరీరే
బాహుతే తుమిమా ౘ శక్తి - హృదయే తుమిమాఁభక్తి
తోమారయి ప్రతిమాగడి మందిరే మందిరే - వందేమాతరమ్.

త్వంహిదుర్గా దశప్రహరణధారిణీ
కమలాకమలదళ విహారిణీ
వాణీ విద్యాదాయినీ - నమామిత్వామ్
నమామికమలాం అమలాం అతులామ్
సుజలాం సుఫలాం మాతరం - వందేమాతరమ్.

శ్యామలాం సరళాం సుస్మితాం భూషితామ్
ధరణీం భరణీం మాతరం - వందేమాతరమ్.





# శ్రీ గణపతి ప్రార్థన



శ్లో ॥ శుక్లాంబర ధరం విష్ణుం - శశివర్ణం చతుర్భుజమ్ ।
ప్రసన్నవదనం ధ్యాయేత్ - సర్వవిఘ్నోప శాన్తయే ॥

శ్లో ॥ అగజానన పద్మార్కం - గజానన మహర్నిశమ్ ।
అనేక దంతం భక్తానాం - ఏకదంత ముపాస్మహే ॥

శ్లో ॥ వక్రతుండం మహాకాయం - సూర్యకోటి సమప్రభ ।
నిర్విఘ్నం కురుమేదేవ - సర్వకార్యేషు సర్వదా ॥

ఉ॥ తొండము నేకదంతమును, తోరపు బొజ్జయు వామహస్తమున్
మెండుగమ్రోయు గజ్జెలును మెల్లని చూపులు మందహాసమున్
కొండొక గుజ్జురూపమును కోరిన విద్యల కెల్ల నొజ్జవై
యుండెడి పార్వతీ తనయ ! ఓయి గణాధిప! నీకు మ్రొక్కెదన్ !!

# శ్రీ సరస్వతీదేవి ప్రార్థన



శ్లో ॥ సరస్వతీ నమస్తుభ్యం - వరదే కామరూపిణీ ।
విద్యారంభం కరిష్యామి - సిద్ధిర్భవతుమే సదా ॥

శ్లో ॥ యాకుందేందు తుషారహార ధవళా యా శుభ్ర వస్త్రాన్వితా
యావీణా వరదండ మండిత కరా యాశ్వేత పద్మాసనా ।
యాబ్రహ్మాచ్యుత శంకర ప్రభృతభిః దేవైస్సదా పూజితా
సామాంపాతు సరస్వతీ భగవతీ నిశ్శేష జాడ్యాపహా ॥



శా ॥ తల్లీ నిన్ను దలంచి పుస్తకము చేతన్ బూనితిన్, నీవు నా
యుల్లంబందున నిల్చి జృంభణముగా నుక్తుల్ సుశబ్దంబు శో
భిల్లం బల్కుము నాదు వాక్కునను సంప్రీతిన్ జగన్మోహినీ
పుల్లాబ్జాక్షి సరస్వతీ భగవతీ పూర్ణేందు బింబాననా ॥

# వివిధ దేవత స్తుతులు (శ్లోకాలు)



**శివస్తుతి**

శ్లో ॥ వందేశంభు ముమాపతిం, సురగురుం, వందే జగత్కారణమ్
వందేపన్నగభూషణం మృగధరం, వందేపశూనం పతిమ్ ।
వందేసూర్య శశాంక వహ్ని నయనం, వందే ముకుంద ప్రియమ్
వందేభక్తజనాశ్రయంచ వరదం, వందేశివం శంకరమ్ ॥

**విష్ణుస్తుతి**

శ్లో ॥ శాంతాకారం భుజగశయనం, పద్మనాభం సురేశమ్
విశ్వాకారం గగన సదృశం, మేఘవర్ణం శుభాంగమ్ ।
లక్ష్మీకాంతం కమల నయం, యోగి హృద్ధ్యాన గమ్యమ్
వందేవిష్ణుం భవభయహరం, సర్వలోకైకనాథమ్ ॥

**శ్రీరామస్తుతి**



శ్లో ॥ శ్రీరాఘవం దశరథాత్మజమప్రమేయమ్
సీతాపతిం రఘుకులా న్వయ రత్నదీపమ్ ।
అజానుబాహు మరవింద దళాయతాక్షమ్
రామం నిశాచర వినాశకరం నమామి ॥

**శ్రీకృష్ణస్తుతి**

శ్లో॥ వసుదేవసుతం దేవం కంసచాణూర మర్దనమ్ ।
దేవకీ పరమానందం కృష్ణం వందే జగద్గురుమ్ ॥

శ్లో॥ కస్తూరీతిలకం లలాట ఫలకే వక్షస్థలే కౌస్తుభమ్
నాసాగ్రే నవ మౌక్తికం కరతలే వేణుం కరేకంకణమ్
సర్వాంగే హరిచందనంచ కలయం కంఠేచ ముక్తావళీం
గోపస్త్రీపరివేష్టితో విజయతే గోపాల చూడామణిః ॥



# వివిధ దేవతా స్తుతులు (పద్యాలు)



**దుర్గస్తుతి**

ఉ ॥ అమ్మలగన్నయమ్మ, ముగ్గురమ్మల మూలపుటమ్మ, చాల పె
ద్దమ్మ, సురారులమ్మ కడుపారడిపుచ్చినయమ్మ, తన్నులో
నమ్మిన వేల్పుటమ్మల మనమ్ములనుండెడియమ్మ, దుర్గ మా
యమ్మ కృపాబ్ధి యిచ్చుత మహత్త్వ కవిత్వ పటుత్వ సంపదల్ ॥

**లక్ష్మీస్తుతి**

మ ॥ హరికిం బట్టపుదేవి, పున్నెములప్రో, వర్థంపు పెన్నిక్క, చం
దురుతోఁబుట్టువు, భారతీగిరిసుతల్ తోనాడు పూబోణి, తా
మరలందుండెడి ముద్దరాలు, జగముల్ మన్నించునిల్లాలు, భా
సురతన్ లేములు వాపుతల్లి, సిరియిచ్చున్ నిత్యకళ్యాణముల్ ॥

**సరస్వతీస్తుతి**



ఉ ॥ శారద నీరదేందు ఘనసార పటీర మరాళ మల్లికా
హారతుషారఫేన రజతాచల కాశఫణీశ కుంద మం
దార సుధాపయోధి సితతామరసామర వాహినీ శుభా
కారత నొప్పు నిన్ను మది గానగ నెన్నడు గల్గు భారతీ ॥

ఉ ॥ అంబ, నవాంబుజోజ్జ్వలకరాంబుజ, శారద చంద్రచంద్రికా
డంబర చారుమూర్తి, ప్రకట స్ఫుట భూషణ రత్నదీపికా
చుంబిత దిగ్విభాగ, శ్రుతిసూక్తి వివిక్త నిజప్రభావ, భా
వాంబర వీధి విశ్రుత విహారిణి, నన్ గృపజూడుభారతీ ॥

**భారతమాత స్తుతి**

శ్లో॥ శ్రీచక్రాంకిత విశ్వదివ్యనగరీ సింహాసనాధ్యాసినీమ్
అంకేలాలిత రామకృష్ణ చరితాం బౌద్ధైర్జినైర్మండితామ్ ।
ఆచార్య ప్రవరైశ్చ నానక దయానందాదిభిర్వందితామ్
వందే భారత మాతరం, సురవరాం వాత్సల్య పూర్ణాంధరామ్ ॥

# భారతమాత స్తుతి

సీ ॥ సగర మాంధాతాది షట్చక్రవర్తుల
అంకసీమల నిల్చినట్టి సాధ్వి
కమలనాభుని వేణుగాన సుధాంబుధి
మునిగితేలిన పరిపూత దేహ
కాళిదాసాది సత్కవి కుమారుల గాంచి
కీర్తినందిన పెద్దగేస్తురాలు
బుద్ధాది మునిజనంబుల తపంబున మోద
బాష్పముల్ విడిచిన భక్తురాలు
సింధు గంగానదీ జలక్షీర మెపుడు
కురిసి బిడ్డల పోషించుకొనుచునున్న
పచ్చిబాలెంతరాలు మా భారతమాత
మాతలకు మాత సకల సంపత్సమేత !



సీ ॥ రజపూత సీకు మరాటాంధ్ర ఘూర్కా మ
హావీర సమితినేయవనిగనియె
జైన హిందూ బౌద్ధ జరతుష్ట ముసలిమాన్
మతముల కేభూమి మాతయయ్యె
వేదవేదాంగ వివిధ కళాశాఖల
పోషించి యేతల్లి పూజ్యయయ్యె
దర్శనవేదాంత తత్త్వ ప్రచారయై
జగతి నేదేవి ప్రశస్తి గాంచె
అట్టి ప్రథిత హిందూస్థాన మకటనేడు
పరులచేబడి క్షీణింప వలసెగాదె
దేవ! జగదీశ! మామాతృదేశమునకు
పూర్వవైభవ మొన గూర్చి ప్రోవుమయ్య !



# శ్రీకృష్ణ శతకం



కం ॥ శ్రీ రుక్మిణీశ! కేశవ!
నారద సంగీతలోల! నగధర శౌరీ!
ద్వారక నిలయ! జనార్దన!
కారుణ్యము తోడ మమ్ము గావుము కృష్ణా!

కం॥ నీవేతల్లివి తండ్రివి
నీవే నాతోడునీడ నీవే సఖుడౌ
నీవే గురుడవు దైవము
నీవే నాపతియు గతియు నిజముగ కృష్ణా!

కం॥ హరియను రెండక్షరములు
హరియించును పాతకముల నంబుజనాభా!
హరినీనామ మహత్త్వము
హరిహరి పొగడంగ వశమెహరి శ్రీకృష్ణా!

కం॥ విశ్వోత్పత్తికి బ్రహ్మవు
విశ్వము రక్షింప దలచి విష్ణుడవనగా
విశ్వము జెఱుపను హరుడవు
విశ్వాత్మక నీవెయగుచు వెలయుదు కృష్ణా!

కం॥ దిక్కెవ్వరు ప్రహ్లాదుకు
దిక్కెవ్వరు పాండు సుతుల దీనులకెపుడున్
దిక్కెవ్వరయ్యహల్యకు
దిక్కెవ్వరు నీవెనాకు దిక్కువు కృష్ణా!

# శ్రీకృష్ణ శతకం



కం॥ బలమెవ్వడు కరిబ్రోవను
బలమెవ్వడు పాండుసుతుల భార్యనుగావన్
బలమెవ్వడు సుగ్రీవుకు
బలమెవ్వడు నాకు నీవె బలమౌ కృష్ణా!

కం॥ అంగనపనుపున దోవతి
కొంగున నటుకులను ముడుచుకొని వచ్చిన యా
సంగతి విని దయనొసగతి
రంగుగ సంపదలు లోకరక్షక కృష్ణా !

కం॥ దుర్జనులగు నృపసంఘము
నిర్జింపగ దలచి నీవు నిఖిలాధారా!
దుర్జనులను వధియింపను
అర్జునునకు నీవు సాదివైతివి కృష్ణా !

కం॥ కొంచెపు వాడని ననుమతి
కుంచకు మీ వాసుదేవ ! గోవింద! హరీ!
అంచితముగ నీకరుణకు
కొంచెము నధికంబు గలదె కొలదియు కృష్ణా!

కం॥ దండమయా! విశ్వంభర !
దండమయా! పుండరీక దళనేత్ర! హరీ!
దండమయా! కరుణానిధి !
దండమయా! నీకు నెపుడు దండము కృష్ణా!



# సుమతీశతకం

కం ॥ శ్రీరాముల దయసేతను
ఆరూఢిగ సకల జనులు నౌరాయనగా
ధారాళమైన నీతులు
నోరూరగ చవులు పుట్ట నుడివెద సుమతీ!

కం॥ కమలములు నీట బాసిన
కమలాప్తుని రశ్మిసోకి కమలిన భంగిన్
తమతమ నెలవులు దప్పిన
తమమిత్రులె శత్రులౌట తథ్యము సుమతీ!

కం॥ వినదగు నెవ్వరు చెప్పిన
వినినంతనె వేగపడక వివరింపదగున్
కనికల్ల నిజము దెలిసిన
మనుజుడెపో నీతిపరుడు మహిలో సుమతీ!

కం॥ తలనుండు విషము ఫణికిని
వెలయంగా తోకనుండు వృశ్చికమునకున్
తలతోక యనక నుండును
ఖలునకు నిలువెల్ల విషము గదరా సుమతీ!

కం॥ తన కోపమె తన శత్రువు
తన శాంతమె తనకు రక్ష, దయ చుట్టంబౌ
తన సంతోషమె స్వర్గము
తన దుఃఖమె నరకమండ్రు తథ్యము సుమతీ!

# సుమతీశతకం

కం ॥ ఉపకారికి నుపకారము
విపరీతము గాదుసేయ వివరింపంగా
అపకారికి నుపకారము
నెపమెన్నక సేయువాడె నేర్పరి సుమతీ!

కం॥ ఎప్పటి కెయ్యది ప్రస్తుత
మప్పటికా మాటలాడి, యన్యుల మనముల్
నొప్పింపక తానొవ్వక
తప్పించుకు తిరుగువాడె ధన్యుడు సుమతీ!

కం॥ అడిగిన జీతం బీయని
మిడి మేలపు దొరను గొల్చి మిడుకుట కంటెన్
వడిగల యెద్దుల గట్టుక
మడి దున్నుక బ్రతుకవచ్చు మహిలో సుమతీ!

కం॥ ఎప్పుడు సంపద గలిగిన
అప్పుడు బంధువులు వత్తురది యెట్లన్నన్
తెప్పలుగ చెఱువు నిండిన
కప్పలు పదివేలు చేరు గదరా సుమతీ!

కం॥ సిరి దావచ్చిన వచ్చును
సలలితముగ నారికేళ సలిలముభంగిన్
సిరి దా పోయిన బోవున్
కరిమ్రింగిన వెలగ పండు కరణిని సుమతీ!



# వేమన శతకం

ఆ.వె॥ అనగననగ రాగమతిశయిల్లుచు నుండు
తినగ తినగ వేము తియ్యనుండు
సాధనమున పనులు సమకూరు ధరలోన
విశ్వదాభిరామ వినురవేమ!

ఆ.వె॥ అనువుగానిచోట నధికులమనరాదు
కొంచెముండుటెల్ల కొదువగాదు
కొండయద్దమందు కొంచెమైయుండదా
విశ్వదాభిరామ వినురవేమ!

ఆ.వె॥ అన్నిదానములను అన్నదానమె మిన్న
కన్నవారికన్న ఘనులు లేరు
ఎన్నగురుని కన్ననెక్కుడు లేరయా
విశ్వదాభిరామ వినురవేమ!

ఆ.వె॥ అల్పబుద్ధివాని కధికార మిచ్చిన
దొడ్డవారినెల్ల తొలగగొట్టు
చెప్పుదినెడి కుక్క చెరుకు తీపెరుగనా!
విశ్వదాభిరామ వినురవేమ!

ఆ.వె॥ అల్పుడెపుడు బలుకు నాడంబరముగాను
సజ్జనుండు పల్కు చల్లగాను
కంచుమ్రోగినట్లు కనకంబు మ్రోగునా!
విశ్వదాభిరామ వినురవేమ!

# వేమన శతకం

ఆ.వె॥ ఆత్మశుద్ధిలేని ఆచారమదియేల
భాండశుద్ధిలేని పాకమేల
చిత్తశుద్ధిలేని శివపూజ లేలరా!
విశ్వదాభిరామ వినురవేమ!

ఆ.వె॥ ఉప్పుకప్పురంబు నొక్కపోలిక నుండు
చూడ చూడ రుచుల జాడవేరు
పురుషులందు పుణ్యపురుషులు వేరయా!
విశ్వదాభిరామ వినురవేమ!

ఆ.వె॥ కుండ కుంభమండ్రు కొండ పర్వత మండ్రు
ఉప్పులవణమండ్రు ఒకటి గాదె
భాషలింతె వేరు పరతత్త్వ మొక్కటే
విశ్వదాభిరామ వినురవేమ!

ఆ.వె॥ గంగిగోవుపాలు గంటెడైనను జాలు
కడివెడైననేమి ఖరము పాలు
భక్తికలుగుకూడు పట్టెడైనను జాలు
విశ్వదాభిరామ వినురవేమ!

ఆ.వె॥ చంపదగిన యట్టి శత్రువు తనచేత
చిక్కెనేని కీడు సేయరాదు
పొసగమేలు చేసిపొమ్మనుటే చావు
విశ్వదాభిరామ వినురవేమ!



# నరసింహా శతకం



సీ॥ నరసింహా! నీదివ్యనామ మంత్రము చేత
దురిత జాలము లెల్ల ద్రోలవచ్చు
నరసింహా! నీదివ్య నామ మంత్రము చేత
బలువైన రోగముల్ బాపవచ్చు
నరసింహా! నీదివ్య నామ మంత్రము చేత
రిపు సంఘముల సంహరింపవచ్చు
నరసింహా! నీదివ్య నామ మంత్రము చేత
దండహస్తుని బంట్ల దఱుమవచ్చు
భళిర! నేనీ మహామంత్ర బలము చేత
దివ్య వైకుంఠపదవి సాధింపవచ్చు
భూషణ వికాస! శ్రీధర్మపుర నివాస!
దుష్టసంహార! నరసింహదురితదూర!

సీ॥ గౌతమీ స్నానాన గడతేరుదామంటె
మొనసి చన్నీళ్లలో మునగలేను
తీర్థయాత్రలచే కృతార్థు డౌదామంటె
బడలి నేమంబు నే నడుపలేను
దానధర్మముల సద్గతిని జెందుదమంటె
ఘనముగా నావద్ద ధనములేదు
తపమాచరించి సార్థకత నొందుదమంటె
నిమిషమైన మనసు నిలుపలేను
కష్టముల కోర్వ నాచేత కాదు, నిన్ను
స్మరణ చేసెద నాయథాశక్తి కొలది
భూషణ వికాస! శ్రీధర్మపుర నివాస!
దుష్టసంహార! నరసింహ దురితదూర!

# నరసింహ శతకం



సీ॥ మాన్యంబులీయ సమర్థుడొక్కడు లేదు
మాన్యముల్ చెఱుప సమర్థులంత
ఎండిన యూళ్ల గోడెఱిగింపడెవ్వడు
పండిన యూళ్లకు ప్రభువులంత
ఇతడు పేదయటంచు నెఱిగింప డెవ్వడు
కలవారి సిరులెన్న గలరు చాల
తనయాలి చేష్టల తప్పెన్న డెవ్వడు
పెఱకాంత రంకెన్న పెద్దలంత
ఇట్టి దుష్టుల కధికార మిచ్చినట్టి
ప్రభువు తప్పులంచును మఱి పలుక వలెను
భూషణ వికాస! శ్రీ ధర్మపుర నివాస!
దుష్టసంహార! నరసింహదురితదూర!

సీ॥ తల్లి గర్భము నుండి ధనము తేడెవ్వడు
వెళ్లిపోయెడి నాడు వెంటరాదు
లక్షాధికారైన లవణ మన్నమెకాని
మెఱుగు బంగారంబు మ్రింగబోడు
విత్తమార్జన చేసి విఱ్ఱవీగుటెకాని
కూడబెట్టిన సొమ్ము కుడవబోడు
పొందుగా మఱుగైన భూమిలోపల బెట్టి
దానధర్మములేక దాచిదాచి
తుదకు దొంగలకిత్తురో దొరల కవునొ
తేనెజుంటీగ లియ్యవా తెరువరులకు
భూషణ వికాస! శ్రీ ధర్మపుర నివాస!
దుష్టసంహార! నరసింహ దురితదూర!



# నారాయణ శతకం



మ॥ ధరసింహాసనమై, నభంబుగొడుగై, తద్దేవతల్ భృత్యులై,
పరమామ్నాయము లెల్ల వందిగణమై, బ్రహ్మాండమాగారమై,
సిరిభార్యామణియై, విరించి కొడుకై, శ్రీగంగ సత్పుత్రియై
వరుసన్నీ ఘనరాజసంబు నిజమై వర్ధిల్లు నారాయణా!

శా॥ నీపుత్రుండు చరాచర ప్రతతులన్నిర్మించి పెంపారగా
నీపుణ్యాంగన సర్వజీవతతులన్నిత్యంబు రక్షింపగా
నీపాదోదకమీ జగత్త్రయములన్ నిష్పాపులన్ జేయగా
నీపెంపేమని చెప్పవచ్చు సుగుణా! నిత్యాత్మ నారాయణా!

శా॥ భూతవ్రాతమునంబుజాసనుడవై పుట్టింతు, విష్ణుండవై
ప్రీతింబ్రోతు, హరుండవై చెఱుతు, నిర్భేద్యుండవై త్రైగుణో
పేతంబై పరమాత్మవై నిలుతు, నీ పెంపెవ్వరుంగానర
బ్జాతోద్భూత సుజాత పూజిత పదాబ్జశ్రేష్ఠ నారాయణా!

మ॥ గగనాద్యంచిత పంచభూతమయమై కంజాత జాండావళిన్
సగుణ బ్రహ్మమయాఖ్యతం దనరుచున్ సంసారివై, చిత్కళా
సుగుణంబై విలసిల్లుదీవు, విపుల స్థూలంబు సూక్ష్మంబునై
నిగమోత్తంసగుణావతంస సుమహానిత్యాత్మ నారాయణా!

మ॥ ఘనభోగాస్పదులై, గతౌఘమతులై, కారుణ్యులై, ముక్తులై,
ధనకీర్తి ప్రదులై, దయాభిరతులై, ధర్మాత్ములై, నిత్యులై,
మనుజాధీశ్వరులై, మనోజనిభులై, మాన్యస్థులై, స్వస్థులై,
ఒనరన్నొప్పెడువారు నీ పదరుచిన్ ఊహించు నారాయణా!

## శ్రీ కాళహస్తీశ్వర శతకం

శా॥ ఏ వేదంబు పఠించె లూత, భుజగం బే శాస్త్రముల్ చూచె, దా
నే విద్యాభ్యసనం బొనర్చె కరి, చెంచే మంత్రమూహించె, బో
ధావిర్భావ నిదానముల్ చదువులయ్యా కావు నీపాద సం
సేవాసక్తియె కాక జంతు తతికిన్ శ్రీకాళహస్తీశ్వరా!



శా॥ రాజుల్మత్తులు వారిసేవ నరక ప్రాయంబు, వారిచ్చు నం
భోజాక్షీ చతురంతయాన తురగీభూషాదు లాత్మ వ్యథా
బీజంబుల్ తదపేక్ష చాలు పరితృప్తిం బొందితిన్ జ్ఞాన ల
క్ష్మీ జాగ్రత్పరిణామమిమ్ము దయతో శ్రీకాళహస్తీశ్వరా!

శా॥ కొడుకుల్ పుట్టరటంచు నెద్దు రవివేకుల్ జీవనభ్రాంతులై
కొడుకుల్ పుట్టరె కౌరవేంద్రున కనేకుల్ వారిచే నేగతుల్
వడసెం బుత్రులు లేని యాశుకునకున్ బాటిల్లనే దుర్గతుల్
చెడునే మోక్షపదంబ పుత్రకునకున్ శ్రీకాళహస్తీశ్వరా!

శా॥ రోసీరోయదు కామినీ జనుల తారుణ్యోరుసౌఖ్యంబులన్
పాసీపాయదు పుత్రమిత్ర జనసంపద్భ్రాంతి వాంఛాలతల్
కోసీకోయదు నామనంబకట నీకుంభ్రీతిగా సత్క్రియల్
చేసీచేయదు దీనిత్రుళ్లణపవే శ్రీకాళహస్తీశ్వరా!

శా॥ రోసిందేటిది రోతలేటివి మనోరోగస్థుడై దేహి తా
పూసిందేటిది పూతలేటివి మదాపూతంబులీ దేహముల్
మూసిందేటిది మూతలేటివి సదా మూఢత్వమే కాని, తా
చేసిందేటిది చేతలేటివి వృథా శ్రీకాళహస్తీశ్వరా!



## దాశరథి శతకం



ఉ॥ శ్రీరఘురామ చారుతులసీ దళదామ, శమక్షమాదిశృం
గారగుణాభిరామ, త్రిజగన్నుత శౌర్యరమాలలామ, దు
ర్వారకబంధ రాక్షస విరామ, జగజ్జన కల్మషార్ణవో
త్తారకనామ, భద్రగిరి దాశరథీ కరుణాపయోనిధీ!

ఉ॥ శ్రీరమసీతగాగ, నిజసేవకబృందము వీరవైష్ణవా
చారజనంబుగాగ, విరజానది గౌతమిగా వికుంఠము
న్నారయ భద్రశైల శిఖరాగ్రముగాగ, వసించు చేతనో
ద్ధారకుడైన విష్ణుడవు, దాశరథీ కరుణాపయోనిధీ!

ఉ॥ 'రా' కలుషంబులెల్ల బయలంబడద్రోచిన, 'మా' కవాటమై
దీకొని ప్రోచునిక్కమది, ధీయుతులైన తదీయవర్ణముల్
గైకొని భక్తిచే నుడువ గానరుగాక, విపత్పరంపరల్
దాకొనునే జగజ్జనుల దాశరథీ కరుణాపయోనిధీ!

ఉ॥ భండన భీముడార్త జనబాంధవుడుజ్జ్వల బాణతూణకో
దండ కళాప్రచండ భుజతాండవ కీర్తికి రామమూర్తికిన్
రెండవ సాటిదైవమిక లేడనుచున్ గడగట్టి భేరికా
డాండడ డాండ డాండ నినదంబులజాండము నిండ మత్తవే
దండము నెక్కి చాటెదను దాశరథీ కరుణాపయోనిధీ!

ఉ॥ దాసిన చుట్టమా శబరి? దాని దయామతి నేలినావు; నీ
దాసుని దాసుడా గుహుడు? తావక దాస్యమొసంగినావు; నే
జేసిన పాపమా? వినుతి సేసిన గావవు; కావుమయ్య, నీ
దాసులలోన నేనొకడ దాశరథీ కరుణాపయోనిధీ!

# సర్వేశ్వర శతకం



మ॥ ఇలసద్భక్తుల పాదధూళి పటలం బెవ్వండు ఫాలంబునన్
జిలికెన్ వాడపవర్గ నాథుడనినన్, సిద్ధంబుగా వాని ని
ర్మల హస్తార్పిత భూతి ప్రీతి నొసలారం బూయు విశ్వాసికిన్
ఫలమూహించి విధింపనెవ్వరికి చెప్పన్ వచ్చు సర్వేశ్వరా!

మ॥ ధరణిం దీర్ఘము లాడుకంటె, నతి మోదం బొప్పయజ్ఞంబులన్
బరగం జేయుటకంటె, సువ్రతములొప్పన్ వేదశాస్త్రార్థ త
త్పరుడై యాదట జల్పుకంటె, మదినుత్సాహించి నీభక్తి మ
త్పురుష శ్రేష్ఠుల పూజసేయుట మహాపుణ్యంబు సర్వేశ్వరా!

మ॥ జలజాత ప్రభవాచ్యుతాదులు మదిం జర్చించి చర్చించి, నీ
కల రూపా రయలేక చిక్కుల బడంగా, నిన్ను హస్తార్పితా
మలక వ్యాప్తికి దెచ్చి యేర్పఱిచి సంబంధించి చేకొన్న భ
క్తుల శౌర్యంబుపమింప నెవ్వడు సమర్థుండింక సర్వేశ్వరా!

శా॥ కాయంబన్నది వారి బుద్బుద సదృక్షం, బందు రూపింప లే
బ్రాయంబన్నది శారదాంబుద తటిత్ప్రాయంబు, సంపత్సుఖ
శ్రేయంబన్నది మాయ, యిట్లెరిగియున్ శీఘ్రంబె నీధ్యానసం
స్థాయీ భావన పొందదేమిటికయో సంసారి సర్వేశ్వరా!

మ॥ తరులం బువ్వులు పిందెలై యొదవి తత్తజ్జాతితో పండ్లగున్
హర! మీ పాద పయోద పూజితములై యత్యద్భుతం బవ్విరుల్
కరులౌ నశ్వములౌ ననర్ఘమణులౌ కర్పూరమౌ హారమౌ
తరుణీ రత్నములౌ పటీరతరులౌ తథ్యంబు సర్వేశ్వరా!



# రామాయణ పద్యాలు



ఆ.వె॥ రామ రామయన్న రారాదు పాపంబు
రామ రామయన్న రాదుభయము
రామ రామయన్న రారాదు మృత్యువు
రామ నామ మమృత రాశియగును

(చాటువు)

ఉ॥ శ్రీమహిమాభి రాముడు, వశిష్ఠ మహాముని పూజితుండు, సు
త్రామ వధూ గళాభరణ రక్షకు, డాశ్రిత పోషకుండు, ధూ
ర్వామల సన్నిభాంగుడు, మహాగుణశాలి, దయాపరుండు, శ్రీ
రాముడు బ్రోచుభక్త తతి రంజిలు నట్లుగ నెల్లకాలమున్

(మొల్ల)

ఉ॥ హాటక గర్భదైవత మహర్షులు దీవెనలియ్యగా, నిరా
ఘాట మరుద్వధూ మధుర గానము నింగి చెలంగ, జానకీ
పాటల గంధి కంధర, శుభప్రదవేళ ఘటించెనా జగ
న్నాటక సూత్రధారి రఘునాథుడు మంగళసూత్రమయ్యెడన్

(రామాభ్యుదయం)

సీ॥ నీలమేఘచ్ఛాయ బోలు దేహము వాడు
ధవళాబ్జపత్ర నేత్రముల వాడు
కంబు సన్నిభమైన కంఠంబుగలవాడు
బాగైన యట్టి గుల్ఫములవాడు
తిన్ననైకనుపట్టు దీర్ఘ బాహుల వాడు
ఘనమైన దుందుభి స్వనము వాడు
పద్మరేఖలుగల్గు పదయుగంబులవాడు
చక్కని పీన వక్షంబువాడు
కపట మెఱుగని సత్యవాక్యముల వాడు
రమణి! రాముండు శుభలక్షణములవాడు
ఇన్ని గుణముల రూపింప నెసగువాడు
వరుస సౌమిత్రి బంగరు వన్నెవాడు

(మొల్ల)

# భారత పద్యాలు

సీ॥ ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని, య
ధ్యాత్మవిదులు వేదాంత మనియు,
నీతివిచక్షణుల్ నీతి శాస్త్రంబని,
కవి వృషభులు మహాకావ్యమనియు,
లాక్షణికులు సర్వలక్ష్య సంగ్రహమని,
ఐతిహాసికులితిహాసమనియు,
పరమ పౌరాణికుల్ బహు పురాణ సముచ్చ
యంబని మహిగొని యాడు చుండ,
వివిధ వేదతత్త్వవేది వేదవ్యాసు
డాది ముని పరాశరాత్మజుండు
విష్ణుసన్నిభుండు విశ్వజనీనమై
పరుగుచుండ జేసెభారతంబు

ఉ॥ సారపు ధర్మమున్ విమల సత్యము, పాపము చేతబొంకుచే
పారము చెందలేక చెడబారినదైన యవస్థ, దక్షులె
వ్వారలుపేక్ష చేసిరది వారల చేటగు గాని, ధర్మ వి
స్తారకమయ్యు సత్య శుభదాయకమయ్యును దైవముండెడిన్

చ॥ నుతజల పూరితంబులగు నూతులు నూటిటికంటె సూనృత
వ్రత! యొక బావిమేలు, మరిబావులు నూరిటి కంటె నొక్కస
త్క్రతు వదిమేలు; తత్క్రతుశతంబున కంటె సుతుండు మేలు, త
త్సుత శతకంబ కంటె నొక సూనృత వాక్యము మేలు సూడగన్

క॥ ఒరులేయవి యొనరించిన
నరవర! యప్రియముతన మనంబున కగు తా
నొరులకు నవి సేయకునికి
పరాయణము పరమ ధర్మపథముల కెల్లన్



# భాగవత పద్యాలు

తే.గీ॥ చేతులారంగ శివుని పూజింపడేని
నోరు నొవ్వంగ హరికీర్తి నుడువ డేని
దయయు సత్యంబు లోనుగా దలప డేని
కలుగ నేటికి తల్లుల కడుపు చేటు

క॥ కలడందురు దీనుల యెడ
కలడందురు పరమయోగి గణముల పాలన్
కలడందురన్ని దిశలను
కలడు కలండనెడువాడు కలడో లేడో!

క॥ ఇందు గలడందు లేడని
సందేహము వలదు చక్రి సర్వోపగతుం
డెందెందు వెదకి చూచిన
అందందే కలడు దానవాగ్రణి వింటే!

మ॥ కలడంభోధి, కలండుగాలి, కలడాకాశంబునన్, కుంభినిన్
కలడగ్నిన్, దిశలన్, పగళ్లనిశలన్, ఖద్యోత చంద్రాత్మలన్
కలడోంకారమునన్, త్రిమూర్తుల, త్రిలింగ వ్యక్తులందంతటన్
కలడీశుండు కలండు తండ్రి! వెదకంగా నేలనీయాయెడన్

క॥ నీపాదకమల సేవయు,
నీపాదార్చకుల తోడి నెయ్యంబును, నితాం
తాపార భూతదయయును,
తాపసమందార! నాకు దయసేయగదే!

## భాగవత పద్యాలు

కII భగవంతుండగు విష్ణువు
జగములకెవ్వేళ రాక్షస వ్యథ కలుగున్
తగనవ్వేళల దయతో
యుగయుగమున బుట్టి గాచు నుద్యల్లీలన్

ఉII ఏనుమృతుండ నౌదునని యింతభయంబు మనంబు లోపలన్
మానుము; సంభవంబు గల మానవ కోటికి చావునిత్యమౌ
కాన హరిం దలంపుమిక కల్గదు దుఃఖము నీకు ధాత్రిలో
మానవనాథ! పొందెదవు మాధవలోక నివాస సౌఖ్యముల్

ఉII ఎవ్వనిచే జనించు జగ, మెవ్వని లోపల నుండు లీనమై,
ఎవ్వని యందుడిందు పరమేశ్వరు, డెవ్వడు మూలకారణం,
బెవ్వడనాది మధ్యలయుడెవ్వడు, సర్వముతానయైనవా
డెవ్వడు, వాని నాత్మభవు నీశ్వరునే శరణంబు వేడెదన్

మII ఒక సూర్యుండు సమస్త జీవులకు తానొక్కొక్కడై తోచు పో
లికనే దేవుడు సర్వకాలము మహాలీలన్ నిజోత్పన్న జ
న్యకదంబంబుల హృత్సరోరుహములన్ నానావిధానూన రూ
పకుడై యెప్పుచునుండు నట్టి హరినే ప్రార్థింతు శుద్ధుండనై

శాII బాలుండీతడు, కొండదొడ్డది, మహాభారంబు సైరింపగా
చాలండోయని, దీని క్రింద నిలువన్ శంకింపగాబోల దీ
శైలాంభోనిధి జంతుసంయుత ధరాచక్రంబు పైబడ్డ, నా
కేలల్లాడదు బంధులార! నిలుడీ క్రిందన్ ప్రమోదంబునన్.



## వేదసూక్తులు



1. ఓంకారం భగవంతుని నామం; ఓంకారాన్ని స్మరించు; ఆ ఓంకారం నీ శరీరానికి కవచంలా ఉండి నిన్ను కష్టాల నుండి రక్షిస్తుంది (సామవేదం)
2. ఆపరమేశ్వరుడు మనకు బంధువు; సృష్టికర్త (యజు)
3. దేవుడెక్కడ ఉంటాడో అక్కడ శుభాలుంటాయి (ఋక్)
4. మానుండి సమస్త దోషాలు దూరం చెయ్ ప్రభూ (యజు)
5. మా పశువులకు భయం కలుగ నీయకు; (యజు)
   మాకు భయం లేకుండా చెయ్ (సామ)
6. నా వాక్కు మృదు మధురంగా ఉండుగాక (అధర్వణ)
7. శ్రద్ధవల్ల సంపదలు కలుగుతాయి (ఋక్)
8. అన్ని దిక్కుల్లో ఉన్న అందరూ నాకు మిత్రులే (ఋక్)
9. దుస్సాంగత్యం వల్ల మానవుడు పతితుడవుతాడు (అదర్వణ)
10. నేను అసత్యాన్ని విసర్జిస్తా; సత్యాన్నే పలుకుతా (యజు)
11. గోవు అమూల్యమైనది; పుష్టికై గోపాలకుడవుకమ్ము (యజు)
12. ముందడుగు వేయి; విజయాన్ని సాధించు (సామ)
13. అంధకారం నుండి ప్రకాశం వైపుగా పయనించు (అధర్వణ)
14. జీవితాన్ని పవిత్రం చేసికొంటూ ఉన్నతిని సాధించు (అధర్వణ)
15. శక్తి పొందడానికి ఆటలాడాలి; వ్యాయామం చేయాలి (అధర్వణ)
16. సంపదలున్నా మామనస్సుశుభంగా సౌమ్యంగా ఉండుగాక (అధర్వణ)
17. మనము ఉత్తమ సంతానం పొందుదం గాక ! (యజు)
18. అజ్ఞానులకు జ్ఞానం ప్రసాదించు (అధర్వణ)

# ఉపనిషత్ సూక్తులు

1. ఈశ్వరుడు అంతటా ఉన్నాడు; ఆయన సర్వవ్యాపకుడు (ఈశావాస్యం)
2. మనిషి నిష్కామభావంతో కర్మలు చేస్తూనే వంద సంవత్సరాలు జీవించాలనే కోరికతో ఉండాలి. (ఈశావాస్యం)
3. సర్వప్రాణులు జ్ఞానికి భగవత్స్వరూపంగా కనిపిస్తాయి (ఈశావాస్యం)
4. బ్రహ్మ ఇంద్రియాలకందడు; కాని ఇంద్రియాలనన్నింటిని ఆయనే నిర్దేశించి నడిపిస్తారు. (కేన)
5. ఈ ప్రపంచంలో రెండు మార్గాలున్నాయి; ఒకటి శ్రేయోమార్గం; రెండోది ప్రేయోమార్గం (కఠ)
6. ప్రేయోమార్గాన్ని అవిద్య అంటారు; శ్రేయోమార్గాన్ని విద్య లేదా జ్ఞానమంటారు (కఠ)
7. ఆత్మ ఎప్పుడూ మరణించేదికాదు; తిరిగి జన్మించేది కాదు (కఠ)
8. కర్మఫలాన్ని అనుభవించిన తర్వాత జీవుడు తిరిగి మానవ లోకానికి వస్తాడు (ప్రశ్న)
9. నిద్ర సమయంలో సర్వేంద్రియాలు మనస్సులోనే ఇమిడిపోతాయి (ప్రశ్న)
10. జగమంతా బ్రహ్మమయం. ఈ ఆత్మా బ్రహ్మమే (మాండూక్య)
11. దేనివల్ల బ్రహ్మ జ్ఞానం కలుగుతుందో అది పరావిద్య. జ్ఞాని అయినవాడు పరమాత్మను అంతటా దర్శిస్తాడు (ముండక)
12. జ్ఞాని మనస్సులోని మలినమంతా జ్ఞానరూప జలం వల్ల కడిగివేయబడుతుంది. (మాండూక్య)
13. పరమాత్మ ఆకలి దప్పికకు కూడా మనుష్య శరీరంలోనే స్థానాలు ఏర్పాటు చేశారు (ఐతరేయం)
14. తల్లి, తండ్రి, గురువు, అతిథి వీరిని దైవ స్వరూపులుగా భావించాలి (తైత్తిరీయం)
15. బ్రహ్మం అమృతం; ఆ అమృతానికి జ్ఞానులే అధికారులు (ఛాందోగ్యం)
16. ఉప్పునీటిలో కరిగినట్లు, ఆత్మ అందరిలో కలిసి ఉంది (బృహదారణ్యకం)



# గీతాసారం



పుట్టిన ప్రతివ్యక్తీ మరణిస్తాడు

మరణం దేహానికే గాని ఆత్మకు లేదు

పుట్టడం చావడం మళ్ళీ పుట్టడం ఇది నిరంతర ప్రక్రియ

చావు పుట్టుకల గురించి ఎవరూ చింతించరాదు

ఎవరి ధర్మకర్మ వారు చేయాలి

కర్మ నిరంతరం చేస్తూనే ఉండాలి

కర్మఫలం అందరిది

కర్మఫలితం తనకే చెందాలని మాత్రం కర్మ చేయరాదు

అందరూ సమానమే

సుఖదుఃఖాలనే ద్వంద్వాలను సమానంగా చూడాలి

మనశ్శాంతి ఉన్నవారిని కష్టాలు – దుఃఖాలు ఏం చేయవు

శ్రేష్ఠుల మార్గంలో అందరు నడుస్తారు

తన ధర్మాన్ని వదలరాదు

కామక్రోధాలు మోక్షమార్గానికి శత్రువులు

గుణాల ననుసరించే కర్మలు చేస్తారు

కర్మల ననుసరించే ఫలితాలు వస్తాయి

ఆత్మ నిష్ఠుడైన బ్రహ్మజ్ఞానిని కర్మలు బంధించవు

అన్నింటినీ వదలిపెట్టు – నన్నే శరణని విశ్వసించు.



శ్లో॥ త్వమేవ మాతాచ పితాత్వమేవ
త్వమేవ బంధుశ్చసఖాత్వమేవ ।
త్వమేవ విద్యా ద్రవిణం త్వమేవ
త్వమేవ సర్వం మమదేవదేవ ॥

**భావం** : నీవే తల్లివి తండ్రివి; నీవే చుట్టానివి మిత్రునివి; నీవే విద్యవు ధనానివి; నీవే సర్వస్వం; నాదేవదేవుడవు నీవే.

శ్లో॥ అమంత్ర మక్షరంనాస్తి
నాస్తి మూల మనౌషధమ్ ।
అయోగ్యః పురుషోనాస్తి
యోజకస్తత్ర దుర్లభః ॥

**భావం** : మంత్రం కాని అక్షరం లేదు. ఔషధానికి పనికిరాని చెట్టులేదు. అయోగ్యుడైన మానవుడు కూడా లేడు. కాని వీటిలో ఈ శక్తి ఉందని గుర్తించే యోజకుడు దొరకడమే కష్టం.

శ్లో॥ మృత్పిండమేకో బహూభాండ రూపం
సువర్ణమేకం బహుభూషణాని ।
గోక్షీరమేకం బహుధేను జాతః
ఏకః పరాత్మా బహుదేహవర్తీ ॥

**భావం** : మట్టిముద్ద ఒకటే కాని అది ఎన్నో కుండలుగా మారుతుంది. బంగారమూ ఒకటే కాని అది కూడా ఎన్నో ఆభరణలుగా రూపాంతరం చెందుతుంది. గోవులెన్నో రంగుల్లో ఉంటాయి కాని అన్నింట్లో వర్తించే ఆ పరమాత్మ ఒక్కటే.







శ్లో॥ సత్యం మాతా పితా జ్ఞానం
ధర్మోభ్రాతా దయా సఖా ।
శాంతిః పత్నీ క్షమా పుత్రః
షడైతే మమ బాంధవాః ॥

**భావం** : నాకు సత్యం తల్లి, జ్ఞానమే తండ్రి. ధర్మమే సోదరుడు, దయయే స్నేహితుడు. శాంతియే భార్య, సహనమే పుత్రుడు, ఈ ఆరుగురే నాకు బంధువులు

శ్లో॥ కృషితోనాస్తి దుర్భిక్షం
జపతో నాస్తి పాతకమ్ ।
మౌనేన కలహో నాస్తి
నాస్తి జాగరతో భయమ్ ॥

**భావం** : వ్యవసాయం వల్ల కరువు పోతుంది. జపం వల్ల పాపం పోతుంది. మౌనం వల్ల కలహం దరిచేరనే చేరదు. జాగ్రత్తగా వ్యవహరిస్తే భయం కూడా దగ్గరికిరాదు.

శ్లో॥ దరిద్రాయ కృతం దానం
శూన్య లింగస్య పూజనమ్ ।
అనాథ ప్రేత సంస్కారం
అశ్వమేధ సమం విధుః ॥

**భావం** : పేదకు దానమివ్వడం, పూజా పునస్కారాలు లేక పడి ఉన్న లింగాన్ని పూజించడం, దిక్కులేని శవానికి దహనాది సంస్కారాలు చేయడం, ఇవన్నీ అశ్వమేధయాగం చేసిన ఫలాన్ని ఇస్తాయి.

# విశ్వ ప్రార్థన



ఓ విశ్వప్రభూ! క్షమా పరిపూర్ణ! ప్రేమమయా!
నీకు నమస్కృతులు, సాష్టాంగ ప్రణామములు
నీవు సచ్చిదానందుడవు, సర్వాంతర్యామివి
సర్వశక్తిమయుడవు, సర్వజ్ఞుడవు
సర్వజీవ హృదయాంతర్వాసివి

కరుణార్ద్ర హృదయము, సమదృష్టి, స్థిర మనస్సు,
భక్తి విశ్వాస జ్ఞానములు మాకు ప్రసాదింపుము
ఇంద్రియములణగద్రొక్కి చిత్త వృత్తుల నరికట్టుటకు
మనోబలము అంతరాధ్యాత్మిక శక్తి నొసంగుము.
కామ-లోభ-ద్వేషముల బారినుండి మమ్ము తప్పింపుము
మా హృదయ ఫలకములను సద్గుణములతో నింపివేయుము

ఈ సకలనామరూపములలో నిన్ను తిలకింపనిమ్ము
నిన్ను సర్వదా స్మరించు కొననిమ్ము
నీ కీర్తులు సదా గానము చేయనిమ్ము
నీ నామము సదా సదా మా పెదవులపై నుండనిమ్ము
నీలోనే సదా మమ్ము వసింప నిమ్ము.





# దైవప్రార్థన

కరుణామూర్తియగు సర్వేశ్వరా! మా చిత్తము సర్వకాల సర్వావస్థలయందును నీపాదారవిందముల యందు లగ్నమై అచంచలమైన భక్తితో కూడియుండునట్లు అనుగ్రహింపుము.

పరమ దయానిధీ! ప్రాతః కాలమున నిద్ర లేచినది మొదలు మఱల పరుండు వఱకును మనోవాక్కాయములచే మా వలన ఎవరికిని అపకారము కలుగకుండునట్లును, ఇతర ప్రాణికోట్లకు ఉపకారము చేయులాగునను సద్బుద్ధిని దయచేయుము!

సచ్చిదానందమూర్తీ! నిర్మలాత్మా! మాయంతఃకరణమునందు ఎన్నడును ఏవిధమైన దుష్ట సంకల్పముగాని విషయవాసనగాని, అజ్ఞానవృత్తిగాని, చొరబడకుండునట్లు దయతో అనుగ్రహింపుము!

వేదాంత వేద్యా! అభయస్వరూపా! మా యందు భక్తి, జ్ఞాన, వైరాగ్య బీజములంకురించి శీఘ్రముగ ప్రవృద్ధములగునట్లు ఆశీర్వదింపుము. మఱియు ఈ జన్మము నందే కడతేరి నీ సాన్నిధ్యమున కేతెంచుటకు వలసిన శక్తి సామర్థ్యములను కరుణతో నొసంగుము.

దేవా! నీవు భక్తవత్సలుడవు! దీనులపాలిటి కల్పవృక్షమవు! నీవు తప్ప నాకింకెవరు దిక్కు? నిన్ను ఆశ్రయించితిని. అసత్తునుండి సత్తునకు గొనిపొమ్ము! తమస్సు నుండి జ్యోతిలోనికి తీసికొని పొమ్ము! మృత్యువు నుండి అమృతత్వమును పొందింప జేయుము. ఇదే మా వినతి. అనుగ్రహింపుము. నీదరిజేర్చుకొనుము.

పాహిమాం, పాహిమాం, పాహిమాం, పాహి...

ఓం తత్ సత్.

ఈ ప్రార్థనను ఎవరు ప్రతిదినము నియమము తప్పక ఉదయము నిద్ర లేచునపుడును, రాత్రి పరుండబోవునపుడును మనస్ఫూర్తిగా పఠించుదురో, అట్టివారికి జీవితమునందేలాటి దోషములున్ను కలుగకుండుటయేగాక సర్వేశ్వరుని యొక్క అనుగ్రహమునకున్ను వారు పాత్రులు కాగలరు.

# శాంతిమంత్రం

1. ఓం ద్యౌశాన్తిః
May Sky be Peaceful

2. అంతరిక్షగ్ంశాన్తిః
May Atmosphere be Peaceful



3. పృథివీ శాన్తిః
May Earth be Peaceful

4. ఆపః శాన్తిః
May Waters be Peaceful

5. ఓషధయః శాన్తిః
May Medicinal herbs be Peaceful

6. వనస్పతయః శాన్తిః May Plants be Peaceful

7. విశ్వేదేవాః శాన్తిః
May all the learned persons be Peaceful

8. బ్రహ్మ శాన్తిః
May God and the Vedas Peaceful

9. సర్వగ్ం శాన్తిః
May all the objects be Peaceful

10. శాన్తి రేవ శాన్తిః
May Peace it self be Peaceful

11. సామా శాన్తి రేధి
May that Peace come unto me. (యజుర్వేదం : 36-17)

ఓం సర్వేపి సుఖినస్సన్తు - సర్వేసన్తు నిరామయాః ।
సర్వేభద్రాణి పశ్యన్తు - మా కశ్చిత్ దుఃఖమాప్నుయాత్ ॥



## మా కార్యక్రమాల దృశ్యాలు



ప్రముఖ రచయిత్రి విదుషీమణి శ్రీమతి మల్లాది పద్మావతి గారిని సన్మానిస్తూ పత్రాన్ని అందిస్తున్న శ్రీమతి భారతిగారు



మమత ఓల్డేజ్ హోమ్‌లో వృద్ధులకు పోటీలు నిర్వహించి, విజేతలకు బహుమతు అందిస్తున్న లైనెస్ తారామతి సింగ్ గారు



ఓల్డేజ్ హోంలో శ్రీశ్రీ జియర్ స్వామితో పాటు భక్తులూ, వృద్ధులున్న దృశ్యం



లైనెస్ డిస్ట్రిక్ట్ ప్రెసిడెంట్ శ్రీమతి ఛాయా కులకర్ణి గారు వృద్ధులతో రాఖీ పండుగ రోజు

కన్నవారి కన్న ఘనులు లేరు